Reg. No. 1118.

విడిపత్రిక ఒక అణా.

# ఆంధ్రపత్రిక

316464

Founder ; K. NAGESWARA ROW

VOL 32. THE ANDHRA PATRIKA MADRAS, TUESDAY, 15-5-1945 No. 36




## రష్యాకు అరువుకవ్వులు సప్లయి నిలుపుదల

### రష్యా పునర్నిర్మాణమునకు బ్రహ్మాండమైన అప్పు కావాలి

వాషింగుటను, మే 13 : జపానుతో యుద్ధం చేయుచున్న రాజ్యాలకు తప్ప మిగిలిన రాజ్యాలకు అమెరికా నుండి అరువుకవ్వులు పద్ధతిగా సామగ్రులు సప్లయి చేయుట నిలిపివేయబడును.

ఈ యుద్ధంలో రష్యాలో ధ్వంసము చేయబడినవన్నిటిని పునర్నిర్మాణము చేసికొనుటకు రష్యాకు అప్పు కావలెనని కోరుచున్నది. అప్పువిషయములో రాయబారముల కొనసాగుటకు కొంత అవకాశం కన్పిస్తోంది. రష్యాకు చాలా బ్రహ్మాండమైన మొత్తము అప్పుగా కావలెనని కోరుతోంది. ఎన్ని వందల కోట్ల డాలర్లు కావలెనో ఇంకా సిద్ధాంతంగా తెలియజేయలేదు.

యుద్ధంలో గెల్పొందుటకు సాధనభూతంగా మాత్రమే అమెరికా ప్రభుత్వం అరువుకవ్వులు సప్లయి చేయుటకు సంకల్పించియుండెనని అమెరికా విదేశాంగ ఆర్థిక వ్యవహారాధికారియగు లియో క్రౌలీగారు శనివారమునాడు అన్నారు. అరువు కవ్వుల పద్ధతి ప్రకారము మొదలు నిర్ణయింపబడిన క్రమవిధాన మిప్పుడు పునఃపరిశీలన చేయబడుచున్నది. ప్రస్తుతం ఆ పద్ధతి ననుసరించిన సరకుల రవాణా తాత్కాలికంగా నిలిపివేయబడినది.

## పండిత జవహర్లాల్

బరేలీ, మే 13 : పండిత జవహర్లాల్ నెహ్రూగారు యింకను ఇజ్జత్‌నగర్ సెంట్రల్ జెయిలులోనే వున్నారనిన్నీ, కొన్ని పత్రికలలో ప్రకటింపబడినట్లు వారిని లక్నోకు బదిలీచేయ లేదనిన్నీ నమ్మకముగా తెలియుచున్నది.

పండిత నెహ్రూగారిని త్వరలో విడుదల చేసెదరను వదంతి కొన్ని వర్గములవారిలో వ్యాపించియున్నది. కాని ఈ వార్తకు ఆధారమేమో బరేలీయందలి విశ్వాసార్హులు తెలుపుటలేదు.

సంయుక్తరాష్ట్రాల చెరసాలశాఖ ఇన్స్‌పెక్టరు జనరలు యిటీవల ఇజ్జత్‌నగరు సెంట్రల్ జయిలును తనిఖీ చేసిరనిన్నీ, పండిత నెహ్రూగారు వున్న వార్డుకుగూడా వారు వెళ్లిరనిన్నీ తెలియుచున్నది. అ. ప్రె.

## అజదుగారి ఆరోగ్యం

బంకూరా, మే 11: బంకూరాలో 'రామ నివాస్' అనే భవనంలో మౌలానా అబుల్‌కలాం ఆజద్ గారు నిర్బంధితులై యున్నారు. అధికముగా ఎలెక్ట్రిక్కు ఫానులు ఎలెక్ట్రిక్కు దీపములు ... 

... అక్కడ ట్రాముకార్ల ...

## జర్మన్ సైన్యానికి నాజీపార్టీ ద్రోహం చేసిందట

### "లొంగిపోవడం సేనానులకు ఇష్టంలేదు"

### జర్మనీలో ప్రచారమవుతున్న వదంతులు

పారిస్, మే 13 : వాయవ్య జర్మనీలోని మిలిటరీ, సివిల్‌శాఖ లన్నిటిపై తనకు అధికారం ఇచ్చినట్లు జనరల్ ఎర్నెస్టుబుష్ ఫ్లెన్స్‌బర్గ్ రేడియోలో నిన్న ప్రకటించుకున్నాడు. ఇది తప్పను ప్రకటనయనిరాయిటర్ ప్రత్యేకవిలేఖరి డెన్నిస్ మార్టిన్ తెలియజేస్తున్నాడు.

జర్మన్‌సేనలపై జర్మనులకు అధికారం ఇవ్వకుండ ... ఉత్తర్వులు ... 

తాము వాస్తవంగా ఓడిపోయామనే విషయాన్ని జర్మనులు నమ్మలేక పోతున్నారు. నాజీపక్షం జర్మన్ సైన్యానికి ద్రోహంచేసి, జర్మన్ సేనానులు ప్రతికూలంగా వున్నప్పటికీ పరాజయాన్ని తెచ్చిపెట్టిందనీ జర్మనీ వీళ్లోట్లు వినబోయినా ఒకరకం ప్రచారమవుతున్నది.

జర్మన్ సైన్యం యథాప్రకారంగా వున్నదనీ, దాని కర్తవ్యం బోల్షివిజమును ధ్వంసంచేయడమే ననీ, యూరపుఖండంలోని విదేశజాతుల కర్తవ్యంకూడా ఇదేనని కొంతమంది జర్మనులు విశ్వసిస్తున్నారు.

వాయవ్య జర్మనీలోని జర్మనుసేనలపై తనకు అధికారం సంప్రాప్తించినట్లు జనరల్ బుష్ చేసిన ప్రకటనను ఎవరైనా నమ్మవచ్చు. అడ్మిరల్ డోనిట్జ్ ఉత్తర్వుల ననుసరించి బ్రిటిషువారితో జరిగిన ఏర్పాటు ఫలితంగా అధికారం తనకు (బుష్‌కు) లభ్యమైనట్లు కూడా ప్రకటించాడు. ఇది అధికారపూర్వకంగా ధ్రువపడలేదు. ఈవిధమైన తప్పుడు ప్రకటనలలో ఇది ఆఖరుదే కావచ్చు.

## సుభాష్ చంద్రబోసు

### స్వతంత్ర భారతకేంద్రం మార్పు

రంగూన్, మే 13: జపానువారు రంగూనును ఖాళీచేసి వెళ్లిన కొన్ని దినములకు సుభాష్‌చంద్ర బోసుగారు జపానీయులతో రంగూనును వదిలిపెట్టి వెళ్లినట్లు తెలుస్తున్నది ... యుద్ధవిలేఖరి ...

'సుభాష్‌చంద్ర బోసుగారున్నా ఆజాద్ హింద్ ప్రభుత్వమున్నా (స్వతంత్ర భారత ప్రభుత్వము) బాంకాక్‌లో తిరిగి తమ స్థావర మేర్పరచుకొన సంకల్పించుచున్నారు. ఆగ్నేయ ఆసియా కమాండు సైన్యములు ముందుకు వెళ్లుట వలన కదలవలసి వచ్చినచొ ... పూరు 'జెల్లిపరు' అని ఆ ఖారతీయుడు చెప్పెను.

## త్వరలో నాయకత్రయ సమావేశము

### హాలిఫాక్సు సూచన

లండన్, మే 13: ప్రధాని చర్చిల్, మార్షల్ స్టాలిన్, ప్రెసిడెంట్ ట్రూమన్ ఈ ముగ్గురు నాయకులు అచిరకాలములోనే సమావేశం కాబోతున్నట్లు అధికార పూర్వకంగా తెలుస్తున్నది. అమెరికాలోని బ్రిటిష్ రాయబారి హాలిఫాక్సు ప్రభువే లాస్ ఏంజెల్సు నగరంలో ప్రసంగిస్తూ ఈ విషయం తెలియజేశాడు. నాయకత్రయము ఈ అంశాలను గురించి చర్చిస్తారు: (1)పోలిష్ సమస్య(2)ప్రస్తుత యుద్ధఖైదీల విచారణ, శిక్ష (3) జర్మనీ ఆక్రమణ, కంట్రోల్; (4) ఆస్ట్రియా భవిష్యత్తు. ఈ సమస్య లన్నిటినీ అగ్ర నాయకులు మాత్రమే పరిష్కరించగలరని కూడా హాలిఫాక్సు ప్రభువు అంటున్నాడు.

సమావేశం ఎక్కడజరిగేదీ హాలిఫాక్సు సూచనప్రాయంగానైనా తెలియజేయలేదు.

## గోరింగ్ ఎడల ఉపేక్షా వైఖరి

### 'ఇజ్వెస్టియా' నిరసన

మాస్కో, మే 13 : రీచ్ మార్షల్ హెర్మన్ గోరింగ్ ప్రస్తుతం అమెరికన్ సేనల చేతులలో ఖైదీగావున్నాడు. ఇతడి విషయంలో మిత్రరాజ్య అధికారుల వైఖరిని సోవియెట్ ప్రభుత్వ పత్రిక "ఇజ్వెస్టియా" ఖండిస్తు ఇలా వ్రాస్తున్నది :

"హంతకుడూ, బందిపోటు దొంగా అయిన గోరింగ్‌ను తక్షణమే విచారణజరిపి ఉరితీసివేయక మిత్రరాజ్యాధికారులు శ్రద్ధగా ఆదరిస్తుండడం వింతగావున్నది."

మార్షల్ గోరింగ్ ఎడల ఉపేక్షవిధానాన్ని అవలంబిస్తున్నందుకు అనేక బ్రిటిషు పత్రికలు ఇదివరకే ఆశ్చర్యాన్నీ, ఆగ్రహాన్ని కనబరిచినవి.

## హిమ్లర్ పట్టుబడినవార్త ధ్రువపడడం లేదు

పారిస్, మే 13 : నాజీనాయకుడు హెన్రిక్ హిమ్లర్ ఖైదీగా చిక్కాడనే వదంతుని మిత్రరాజ్య 'సుప్రీమ్' కార్యాలయంలో ధ్రువపరచడం లేదు.

## ఐండనను పోలిష ప్రభుత్వంపై రష్యానింద

మాస్కో, మే 13 : ... 100 మంది రష్యను సైనికులు కొందరు రష్యను సైనికోద్యోగులు నష్టమైరనియు రష్యాలోని ప్రవాదాపత్రిక నిందిస్తూ వ్రాసింది. ఈ ద్రోహచర్యలు ఎవరెవరు చేసిరో ఎవరిప్రేరేపణవల్ల చేయబడెనో ఆ విషయము లన్నియు రూఢిగాఋజువు అయినవనికూడా వ్రాసెను.

## జపానుకు రష్యా హెచ్చరిక

### సూంగ్ మాస్కో వెళ్లవచ్చు

చుంకింగ్, మే 14 : శాన్ ఫ్రాన్సిస్కో సభనుంచి తిరిగి పోతూ చైనా విదేశాంగ మంత్రి టి. వి. సూంగ్ మాస్కోకు వెళ్లవచ్చునని తెలుస్తున్నది. రష్యా, చైనా సంబంధాలను బలపరచడానికి ఇతడు ప్రయత్నిస్తాడు. పసిఫిక్ యుద్ధంలో రష్యాకూడా దిగాలని చైనాపత్రికలు వ్రాస్తున్నవి.

మంచూరియా సరిహద్దు ప్రాంతంనుంచి జపాన్ సేనలు ఖాళీచేసి పోవాలని రష్యా జపానును హెచ్చరించినట్లు ఇక్కడ వదంతిగా వున్నది.

## ఫ్రెంచిగనులలో జర్మను కార్మికులు

ప్యారిసు, మే 13 : జర్మను పోలీసు గూఢచార భటులు 30 వేల మందిచేత ఫ్రెంచి గనులలో పనులు చేయిస్తారని పారిశ్రామికఉత్పత్తి శాఖామంత్రియగు రాబర్టు లాకోస్టుగారు లీపాప్యులేర్ అనేపత్రిక తాలూకు ప్రతినిధితో అన్నారు.

## రష్యాతో యుద్ధానికి దిగడం హిట్లర్ చేసిన పెద్దతప్పు

### బ్రిటిష్ ప్రధాని యుద్ధ సమీక్ష

### డివెలరా తటస్థ వైఖరిపై విసుర్లు

(అమెరికను అసోసియేటెడ్ ప్రెస్)

లండన్, మే 13: ద్వితీయ ప్రపంచ సంగ్రామములో ఐర్లెండ్ ప్రధాని డి వలెరా తటస్థవైఖరిని బ్రిటిష్ ప్రధాని చర్చిల్ తీవ్రముగా విమర్శించినారు. ముగిసిన యూరప్ యుద్ధగతినిగురించీ, ముగింపు చేయవలసి వున్న జపాన్ యుద్ధ ...

... ఎంతో తేలిక అయినా అలా చేసివుండలేదనీ బ్రిటిష్ ప్రధాని ప్రకటించినారు. అమెరికా యుద్ధములోకి దిగినతరువాత, అంతిమ విజయం విషయంలో తమకేలాంటి అనుమానమూ, ఎన్నడూ, కలుగలేదని చెప్పినారు. చాలాకాలము ఏకాకిగా బ్రిటన్ నాజీసేనలప్రతిఘటించిన సంఘటనల పునశ్చరణ చేయుచూ, ఒంటరిగా పోరాడుతూవుంటే, ఆ నిరంకుశ రాక్షసి మహాదారుణమైన తప్పుచేసి తీరుతాడనీ అలాగే హిట్లర్ రష్యామీదా, జపాన్ అమెరికామీద యుద్ధం ప్రారంభించినదని చెప్పినారు.

### వివరములు

చర్చిల్ ఉపన్యాసము గురించి రాయిటర్ వార్తాహరు ఈక్రిందివివరాలను తెలుపుతూవున్నారు.

భావికాలపు ప్రమాదాలనూ సమస్యలనూ ఎదుర్కొనడానికి అయిదేళ్ల క్రిందటికంటే ఇప్పుడు మంచిస్థితిలో ఉన్నాము అనీ, బ్రిటిష్ కామన్వెల్తు రాజ్యాలలో ఐక్యత, కలసికట్టు ఇప్పుడూ చాలా ఎక్కువగా ఉందనీ తెలియచేస్తూ ఐర్లెండ్ వైఖరిని విమర్శించినారు. ఐరిష్‌జాతియెడ బ్రిటిష్ ద్వేషం తన హృదయంనుంచి పూర్తిగా పోయిందన్నారు. ముమ్ముందు పరస్పరసహకారంద్వారా, మన్నింపువల్లా పూర్తిగా తొలగిపోగలదని ప్రార్థించుకూ ఉన్నామనీ, అంతవరకూ తాము జీవించి కళ్లారా చూడలేనేమో అనీ అన్నారు.

జర్మనీ 1941 జూన్ 22 న రష్యాపై యుద్ధం ప్రకటించడం ఘోరమైన తప్పు అంటూ ప్రధాని సమరసమీక్షకు ఉపక్రమించినాడు. ఫ్రాన్సు రక్షణకు జర్మనీని జోడించుటకు అమెరికా అపారశక్తి సంపదలను బ్రిటన్ ఎన్నడూ నుప్తింపక పోలేదనీ నేడు యూరప్ రణరంగములో 35 లక్షలమంది అమెరికన్ సైనికులు

2 వ పేజీ చూడుడు

## గంటకు 3 చుట్టలు ధుమా!

### చుట్టల వ్యాపారస్థులకు చర్చిల్ మంచి ఖాతాదారు

న్యూయార్క్, మే 13 : బ్రిటిషు ప్రధాని చర్చిల్ ... చుట్టల వ్యాపారస్థులకు మంచి ఖాతాదారు ...

## దూరప్రాచ్యయుద్ధరంగానికి ఫ్రెంచిసేనను పంపడానికి ఫ్రాన్సు సంసిద్ధత

### మిత్రసైన్య శాఖాధికారుల నిరాకరణ

పారిస్, మే 13 : దూరప్రాచ్య యుద్ధరంగానికి తక్షణమే ఫ్రెంచిసేనలను పంపడానికి తాము సిద్ధంగావున్నట్లు ఫ్రెంచి ప్రభుత్వం తెలియజేయగా, మిత్రరాజ్య సంయుక్త సైన్య శాఖాధికారులు ఫ్రాన్సు కోర్కెలను రోసి రాజన్నారని అడ్మిరల్ పీరీ బార్జో బయటపెడుతున్నారు. అడ్మిరల్ బార్జో ఫ్రెంచి సైన్య శాఖోద్యోగి. ఫ్రెంచి కోర్కెలను మిత్రరాజ్యాధికారులు ఈవిధంగా తిరస్కరించడానికి కారణమేమిటో తెలియడంలేదు", అని కూడా బార్జో అంటున్నాడు.

అడ్మిరల్ బార్జో ఇంకా ఇలాకూడా అంటున్నాడు: "ఇప్పటికి కొన్నిరోజులక్రితం ఫ్రెంచి వలసరాజ్య శాఖామంత్రి రీనీప్లీవెన్, పసిఫిక్ రంగానికి తక్షణమే తరలి వెడలడానికి రెండు ఫ్రెంచి సైనికదళాలు సిద్ధంగా వున్నవని ప్రెసిడెంట్ ట్రూమన్‌కు తెలియజేశాడు."

### ఇండో చైనా భవిష్యత్తు

"దూరప్రాచ్య వలస భూభాగాలలో కొన్నిటికి అంతర్జాతీయ ధర్మకర్తృత్వ విధానం వర్తిస్తుందనే సూచన వెలువడగానే, ఆ విధానం ఫ్రెంచి ఇండో-చైనాకు కూడా వర్తిస్తుందేమోనని ఫ్రెంచివారు భయపడ్డారు. ఫ్రెంచి ఇండో చైనాను జపానువారు గెలుచుకోలేదు. విషీ ప్రభుత్వమే ఇండో చైనా లొంగుబాటుకు దోహదం చేసింది. పెరల్ హార్బర్‌పై ముట్టడి జరగడానికి మూడు నెలల క్రితమే విషీ, టోకియో ప్రభుత్వాలు ఒడంబడిక చేసుకున్నవి. ఈ ఒడంబడిక జరిగినమీదట జపానువారు ఇండో చైనాలో 40 వేల సేనను సమాయత్తపరిచారు. విషీ అధికార్లు ఈ శత్రుసేనకు మిలిటరీ సౌకర్యా లన్నిటినీ కలిగించారు. జనరల్ డిగాల్ ఈ ఒడంబడికను ఎన్నడూ గుర్తించలేదు. ఇండో చైనా పరిస్థితికీ, మిగతా వలసల పరిస్థితికీ వ్యత్యాసం వున్నదని నాయకత్రయం నిర్ణయించవచ్చునని కొంతమంది ఫ్రెంచివారు అభిప్రాయపడుతున్నారని కూడా బార్జో అంటున్నాడు.

## గ్రీసులో ఫెసిస్టు నియంతృత్వపాలన

### లండన్ గ్రీక్ సభలో స్ట్రాబోల్గీప్రభువు ఖండన

లండన్, మే 13 : లండన్‌లోని గ్రీక్ వ్యాపారనాయకాదుల సంఘసమావేశంలో స్ట్రాబోల్గీప్రభువు ప్రసంగిస్తూ ఇలా తెలియజేశాడు : "మిత్రరాజ్యాలు విజయోత్సవం జరుపుకుంటున్న ఈసమయంలో కూడా యూరప్‌ఖండంలో కళంకకారకమైన ప్రాంతాలు లేకపోలేదు. వాటిలో గ్రీసు ఒకటి. బ్రిటిష్‌వారి ఆయుధబల సహాయంతో ఏర్పడిన నియంతృత్వపాలన అక్కడ చేయ సాగుతున్నది.

"కేవలం ప్రస్తుత దశలోనే ... 50 వేలమంది ... 

## ఆస్ట్రియా స్వాతంత్ర్యం: పెద్దరాజ్యాల అభయహస్తం

లండను, మే 14 : ఆస్ట్రియారేడియోలో కొత్త తాత్కాలిక మంత్రివర్గము యొక్క భవిష్యత్కార్యవిధానను నేడు ప్రకటింపబడినది కొత్త ఆస్ట్రియను మంత్రివర్గమునకు సోషలు డెమొక్రటు పార్టీ వారైన డాక్టరు కార్ల్ రెన్నరు నాయకత్వం వహించాడు.

ఆస్ట్రియాను ఇతరుల ఆక్రమణలోనుండి తప్పించుటయును, ఆస్ట్రియాను సంపూర్ణ స్వతంత్ర రాజ్యంగా పునః ప్రతిష్ఠించుటకును కొత్త మంత్రివర్గం పూనుకొనును. నాజీలకు ప్రత్యక్షంగా తోడ్పడినవారందరు శిక్షింపబడుదురు, కాని, కొన్ని అనివార్య పరిస్థితుల మూలంగా నిర్బంధవిధిగా తమ అసహాయస్థితిలో నాజీలకు తోడ్పడినవారును నాజీలు చేసిన ఘోరనేరములయందు పాల్గొనని వారును తిరిగి తమఇండ్లకు పోవచ్చును.

ఆస్ట్రియా స్వతంత్రరాజ్యంగానే ఉండగలదని మూడు పెద్దరాజ్యాలవారు అభయహస్తము నిచ్చియున్నారు. వారికి ఆస్ట్రియా రాజ్యభాగమేదియున్నూ తీసికోవలెననే సంకల్పంలేదు.

ఏది ఎట్లాగైనప్పటికీ ఇండోచైనాలో శత్రుసేనలతో తలపడి పోరు సాగించడం అవసరమని ఫ్రెంచి ప్రభుత్వ ఉద్దేశం. అక్కడవున్న ఫ్రెంచి సేనలకంటె జపాను సేనల బలమే ఎక్కువనీ, ఈ కారణాలవల్లా, ఇతర కారణాలవల్లా పసిఫిక్ యుద్ధంలో పాల్గొనాలని ఫ్రెంచి సేనలు కుతూహల పడుతున్నవనీ కూడా ఫ్రెంచి అధికారి అంటున్నాడు.

## యాల్టా నిర్ణయాల పునరాలోచన అవసరమని ఫ్రాన్సు తహతహ

పారిస్, మే 13: ఫ్రెంచి జాతీయ సలహాసంఘవిజయోత్సవ సమావేశం ఈరోజు జరగబోతున్నదనీ, ఆసమావేశంలో ఇక జర్మనీని ఫ్రెంచిప్రభుత్వం ఏవిధంగా చూడాలనే అంశాన్నిగురించి జనరల్ డీగాల్ ప్రసంగించబోతున్నాడనీ రాయిటర్ ప్రత్యేకవిలేఖరి హెరాల్డు కింగ్ వ్రాస్తున్నాడు. రష్యా, బ్రిటన్, అమెరికాల సమావేశాలలో ఫ్రాన్సుకు సమాన హోదాలో ప్రాతినిధ్యం వుండాలని డీగాల్ ప్రతిపాదించబోతున్నట్టుకూడా తెలుస్తున్నది. జర్మనీ భవిష్యత్తును ఇతిమిత్థమని నిర్ణయించుకోడానికి "నాల్గురాజ్యాల అగ్రనాయకులు త్వరలో సమావేశమై సవివరంగా చిన్న జరపడం అత్యంత వాంఛనీయమైన విషయమని అధికార వర్గాలవారు అభిప్రాయపడుతున్నారు. జర్మనీలో ఫ్రెంచివారు ఆక్రమించవలసిన మండలం హద్దులను అధికార పూర్వకంగా ధ్రువపరచుకోవాలని ఫ్రాన్సు ముఖ్యంగా కోరుతున్నట్లు వినవస్తున్నది. జర్మనులు అపహరించిన ఫ్రెంచి కళాసామగ్రిని తిరిగి స్వాధీనపరచుకోవాలన్నది ఫ్రెంచివారి మరొక కోరిక. ఫ్రాన్సులో జరిగే పునర్నిర్మాణ కార్యక్రమంలో జర్మన్ ఖైదీలను ఉపయోగించాలని కూడా ఫ్రాన్సు అభిలషిస్తున్నది.

జర్మనీ విషయమై యాల్టా సమావేశంలో జరిగిన నిర్ణయాల పరిస్థితి ఏటా కాకుండా అయిపోయింది కొట్టి, జర్మనీ ఎడల మిత్రరాజ్య విధానాన్ని పునరాలోచించడం అవసరమని ఫ్రెంచి అధికారుల అభిప్రాయం. అతిత్వరలోనే ఇంగ్లాండు - ఫ్రాన్సుల మధ్య ఒడంబడిక జరగడం అవసరమని ఫ్రెంచివారు కోరుతున్నట్లు "లా నేషన్" పత్రిక సంపాదకీయం వ్రాసింది. రష్యాతో జరిగినట్లుగానే, బ్రిటనుతో కూడా ఫ్రాన్సు త్వరితగతిని ఒడంబడిక చేసుకోకపోయినందుకు ఈ పత్రిక ఫ్రెంచి ప్రభుత్వాన్ని విమర్శిస్తున్నది.

### ఈడెను ప్రయాణం

శాన్ ఫ్రాన్సిస్కో, మే 13: బ్రిటిష్ విదేశాంగమంత్రి ఆంథోనీ ఈడెన్ రాయల్ విమానంలో వాషింగ్టన్ మీదుగా లండను ప్రయాణమైనాడు. వాషింగ్టన్‌లో ఇతడు ప్రెసిడెంట్ ట్రూమన్‌ను కలుసుకుంటాడు.

## జర్మనీలో మిత్రరాజ్య మిలిటరీ శాసనాలు

### హిట్లర్ యువజనచట్టం రద్దు

లండన్, మే 13: జర్మనీలో నాజిజము నాశనం చేయడానికి మిత్రరాజ్య మిలిటరీ ప్రభుత్వం అనేక ఉత్తర్వులను జారీచేసిందని ఫ్లెన్స్‌బర్గ్ రేడియో ఆదివారంనాడు ప్రకటించింది. వాటిలో కొన్ని: (1)నేషనల్ సోషలిస్టుపార్టీ రద్దు. (2) ఆంగ్లభాషను అధికార భాషగా అంగీకరించడం. (3) రాజకీయపక్షాలు ఏర్పరచకూడదనే నాజీ శాసనం రద్దు. (4) హిట్లర్ యువజనచట్టం రద్దు. (5) జర్మన్ జాతికి సైనికవారమ్రాత్రి 8 మొదలు తెల్లవారుజాము 4-30 వరకు బయటికి రాకూడదని కర్ఫ్యూ ఉత్తర్వు.

### జర్మను ప్రతిఘటన

లండన్, మే 12 : విజయ ప్రకటన జరిగి నాలుగు రోజులు అయినప్పటికీ జెకొస్లొవేకియాలోని జర్మను సైనిక లింకా తీవ్రముగా పోరాడుచున్నారు. ఈ జర్మను సేనలు, అమెరికను, రష్యను సేనల మధ్యనున్న అనాక్రమిత ప్రాంతంలో ఉన్నారు. ఈ 2 సేనల కలయికతో అక్కడి జర్మనుసేనల పని పూర్తి అవుతుంది. మిత్రసేనలు ఆక్రమించిన ప్రాంతంలోని జర్మనుసైనికులు, ప్రజలు కొంతమంది ఆత్మహత్య గావించుకొనుచున్నారు.

## నోటీసు

నా యొక్కయు నా సోదరుడు

శ్రీ రాజా యనుముల రామం దొరగారి యొక్కయు తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం తాలూకా చింతలూరు గ్రామం తాలూకు పోజెస్టు ప్రాదుర్యాసుతోపాటు రైతువారీ భూములలో ఉన్న టువంటి కుంకుడుతోట్లు, కొంతలనివాస వ్యవసాయము చేసుకొనుటకున్న పుల్లరివగైరాలు నా యొక్కయు, నా తమ్ముని యొక్కయు తూర్పుగోదావరి జిల్లా కోర్టువారిచే నిర్ణయింపబడ్డ ప్రాపర్టీ గార్డియను శ్రీ చిత్రపు బుచ్చి వెంకయ్య పంతులుగారు మూడుసంవత్సరములకు లోగడ మా ఎస్టేటు వీలుగా క్రిన్నముగా వేలం వేయదలచుకొన్నారని అంగనిని త్వరితముగా పరిస్థితులు శ్రీ కోర్టువారికి తెలియపరచకుండా వేలం జరుప ఉద్దేశించినారని నాకు తెలియవచ్చినందున అందును గురించి నేను శ్రీ కోర్టువారికి నిజపరిస్థితులు మనవిచేసుకొనుటకు ప్రయత్నించుచున్నాను. నాకు ది 16—10—1945 తేదీతో మెజారిటీ రాగలదు. ఈ సందర్భములో 16—10—45 దనిమిలా అనుభవములో వుండేటట్లు ఫారెస్టు ప్రాదుర్యాసును వేలం వేయుటకు ప్రకారము మా ప్రాపర్టీ గార్డియనుగారికి యెట్టి సాధకముకు లేనందున సదరు వేలంలో పాల్గొనదలచిన పాటదారులకు ఎట్టి హక్కు కలుగనేరదనిన్నీ, పాటదారులు యీ నోటీసును శ్రీఘ్రంగా వచ్చుకొనినయెడల అందువల్ల కలిగే నష్టమునకు వారే బాధ్యులు అనుకొనిన్నీ, అట్టి వేలం మన్నులను యెంత మాత్రము బయిందు చేయదని అందరికీ తెలియజేయడమైనది. ఇట్లు,

శ్రీ రాజా యనుముల సూర్యనారాయణమూర్తి దొర,
జమీందారు, చింతలూరు ఎస్టేటు.



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No 7 Thambu Chetty Street, G. T, Madras.

## కరపత్రముల కేసు
## 16 తేదీకి వాయిదాపడింది

నుడివాడ, మే.9: శ్రీ ధర రంగనాథ కుల్కర్ణి, మూరపనేని శేషగిరిరావుగార్లపై దావా నిన్న సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు కోర్టులో విచారణకు వచ్చినది. ప్రాసిక్యూషన్ తరపున సి. ఐ. డి. స్పెషల్ బ్రాంచి సబ్ ఇన్ స్పెక్టరు సుందరేశ్వరరావు నాయుడుగారు, విచారింపబడిరి. ముద్దాయిలు సాక్షులను తెచ్చుకుంటూ మన్నందున 16 తేదీకి వాయిదా వేసెది. వీరివద్ద కరపత్రములు దొరికెనవని కేసు.

1943 ఏప్రిల్ 2 న కుల్కర్ణిగారు అరెస్టయి సెప్టెంబరు 11 న పారిపోయి బొంబాయిలో 1944 మార్చి 8 న పట్టుబడినారు. ఏప్రిల్ 9 న బెజవాడకు తెచ్చి పారిపోయిన నేరానికి ఆగస్టు 24 న 6 నెలల శిక్ష విధించారు.

శేషగిరిరావుగారు ఈ నేరానికి బెజవాడ జాయింటు మేజిస్ట్రేటుచే విచారించబడి వదిలివేయబడినారు. కాని వెంటనే అరెస్టుచేశారు. పునర్విచారణకై రెండు నెలల క్రితం రాయవేలూరునుంచి ఇక్కడికి తీసుకొని వచ్చారు.

ఈ కేసులో 3 వ ముద్దాయి నుడిపాటి రామకృష్ణారావుగారికి లోగడనే 6 నెలలు కఠినశిక్ష రూ 200 జరిమానా విధించబడినది. తుయగ్రస్తుడై బళ్లారి సానిటోరియం జైల్లో ఉన్నాడు.

నిన్న విచారణలో జాస్తి సీతామహలక్ష్మమ్మగారు (మద్రాసు) ముద్దాయిల తరఫున హాజరైనారు.

## మదరాసులోవిజయోత్సవం

మదరాసు, మే 14: మదరాసులో ప్రభుత్వంవారు నిర్ణయించిన విజయోత్సవం నేడుదయం 8-30 గం. సైనికుల పెరేడుతో ప్రారంభమయ్యెను. నగరం అన్ని మూలలనుంచి కొన్ని వేలమంది ఐలండు గ్రౌండ్సువద్ద మనోవిగ్రహంకద్దకు చూడవచ్చిరి. మవుంటురోడ్డునుంచి సెంట్రలు స్టేషనువరకు బుష్లరవాదా ఆసనమువాసనలిపే ది. గవర్నరు వందనములు రాగానే బ్యాండు ప్రారంభించబడెను. ఏరియా కమాండరు మేజరు జనరలు వేడుగారు, వారిని సన్మానించి, యూనియనుజాకు ధ్వజస్తంభంక్రింద వారు ముగ్గురు నిలువగా ఎదుట వరుసగా రాయలునేవీ, ఇండియను నేవీ, కాల్బలములు, సిగ్నల్సు, ఇంజనీర్లు, వైమానికులు, సివిలుపోలీసు మున్నగు వివిధ దళములవారు సలాం చేయుచు కవాతు చేయుచు పోయిరి. స్త్రీల విధ్యుక్తసేవా దళమునకు చెందిన మోటారులలో అప్పయిజరు రామమూర్తిగారి భార్య యుండెను. స్త్రీల సేవాదళములు, ఆంబ్యులెన్సు, మదరాసు ఫైరుసర్వీసు మోటారులు కూడ కవాతులో పాల్గొన్నవి. ఎ. ఆర్. పి. దళము స్వాంతబ్యాండులో ఆఖరు ప్రదర్శనం చేసిపోయెను. అంతేయు ఒక గంటసేపయ్యెను. ఫోటోలు, సినీమాలు తీయబడెను. గవర్నరుగారు రాగానే మదరాసు గార్డు ఒసంగిన గార్డుఆఫ్ఆనరు తిలకించిరి.

సెంట్రలుస్టేషను భవనమందంతట సామ్రాజ్యదేశము లన్నింటి పతాకములతోను వి. ఆకారమున ఎలక్ట్రికు బల్బులతోను అలంకరించబడెను. ఇట్లే మదరాసులో అనేక భవనము లలంకరించబడినవి.

### ప్రార్థనలు

విజయోత్సవం సందర్భమున ఆదివారం సాయంకాలం కెథెడ్రలు చర్చిలో జరిగిన ప్రార్థనలకు గవర్నరు దంపతులు, సైనిక దళాల ప్రతినిధులు హాజరయ్యిరి. ప్రార్థనానంతరం మదరాసు బిషప్పుగారు ఉపన్యసించిరి. కోటలో చర్చియందు యితర చర్చిలందు కూడ ప్రార్థనలు జరిగెను.

హిందూ దేవాలయములందు అభిషేకం దేవస్థాన సంఘంవారు జరిపించిరి. పేదలకు అన్నదానం కందస్వామికోవిలవద్ద జరిగెను.

## మదరాసు ధరలు

మదరాసు, మే 14:

వేరుసెనగ: (531 పౌ॥ బా॥ 1-కి ఎప్పు కోస్తా గిడ్డంగులు) క్రొత్తరకం మెషిన్‌పప్పు డిటో ఆఫీసు వెల 57-0-0 వేరుసెనగనూనె (ఇంగ్లీషు కాండి 500 పౌనుగలది) 1-కి యెక్కురకం 144-0-0: ఎప్పు పెల్లెర్ (నేర్పు టాప్పుతోసహా) దుష్టాకు బేరు వెంకాయనూనె 38 పౌనుగల దబ్బా 1-కి 17-14-9 కొబ్బరి కాయలు (సరోసురకం) 1100-కి 130-0-0 150-0-0: రెండోరకం కొరవాచేరి 95-0-0, 105-0-0: ఆముదము (మిల్ డిలెవరి) ఎప్పు పెల్లను పర్ ఇంగ్లీషు కాండి 500 పౌనులుగలది 195-0-0. చక్కెర: కాన్పూరు 52-6-0 53-1-0.

### నూలుధరలు

మధురమిల్సు:— 20 నెం. బూడిదెరంగు (10 పౌ) రూ. 11-9-0. 40 నెం. బూడిదెరంగు (10 పౌ) 17-14-0. 60 నెం. బూడిదెరంగు (5 పౌ) 19-0-0. 80 నెం. బూడిదెరంగు (5పౌ) 25-0-0. కోయంబత్తూరు మిల్సు:- నెం. 20½ పండోరియా (10 పౌ) 11-10-0. 40 నెం. కామధేను (10 పౌ) 17-14-0. 40 నెం. ఇతరరకాలు (10పౌ) 17-14-0. 60 నెం. కొత్తారి మొదటిరకం (5 పౌ) 19-0-0. 60 నెం. కాళ్విన్ (5 పౌ) 19-0-0. 80 నెం. ఇతరరకాలు (5 పౌ) 25-0-0. 100 నెం. ఇతరరకాలు (5 పౌ) రూ. 32-8-0.

## మద్రాస్ దేవాంగసంఘ 3 వ వార్షిక సభ
### భట్టి కుమారస్వామిగారి అధ్యక్షోపన్యాసము

మన దేవాంగసంఘములో జన్మించిన పలు విద్యావివేకములచేతను, సత్ప్రవర్తనచేతను మహత్తర పరోపకారకార్యములనాచరించి సర్వసంఘముచేతను పూజింపబడిన మద్రాసురాష్ట్రమునకు మకుటము లేనిమహారాజై ప్రభుసమ్మానమునకై భాగ్యము కీర్తిశేషులైన సర్ పి. త్యాగరాయశ్రేష్ఠిగారి పవిత్రనామమును నొక్కమారు స్మరించుట మన పరమధర్మమని భావించుచున్నాను.

తాము మూడేండ్లనాడు సంఘమును స్థాపించి నేటివరకు ఏవిధమైన అంతరాయమును కలిగింపక సక్రమముగా సాగింపుము, ఐక్యమత్యముతో ప్రవర్తించుచుండుట నాకు మిక్కిలి ఆనందమును కలిగించుచున్నది.

మా పెనగ్రామములో బట్టనేత కు మందకు సాహాయ్యనాయను ప్రోత్సహించి ప్రతిసంవత్సరము కొందరు బీదవిద్యార్థులకు ఉన్నత విద్యాదానము చేయు భాగ్యము పొందగల్గుచున్నాము. బందరులో ఒక హాస్టల్ కూడ నిర్మింపనున్నాము. ఈ సంఘమువారు గూడ మూడేండ్లనుండి ధర్మార్థమాయ మార్జించుచు సత్కార్యములకు వినియోగించుట మిక్కిలి ప్రశంసనీయము. ఈ ధర్మసంస్థకు సంఘీయులందరును సక్రమముగా సహాయపడుచు విఘ్నములను రానీయక చిరస్థాయిగా చేయుగలరని విశ్వసించుచున్నాను.

### యువజనులు

ఎన్నటికైనను మన దేశమును, మన జాతిని, మన కులమును ఉద్ధరించు భారము యువకులను మీయందే నిలిచియున్నది. కనుక దేవాంగయువకులు మిక్కిలి విలువగల తమ కాలములో ఒక్కక్షణము కూడ వ్యర్థముచేయక స్వకులాభ్యుదయమునకై యుండునగా ప్రయత్నింతురుగాత.

### విద్య

మన కులమునందు నూటికొక్కడు గూడ విద్యావంతుడు లేకపోవుట చాల విచారకరము. పురుషులకే గాక స్త్రీలకు కూడ విద్య ముఖ్యావశ్యకమై యున్నది: కనుక మన బాలబాలికలను పాఠశాలలకు బంపి విద్య నేర్పించు విషయములలో మీరు యెక్కువ శ్రద్ధ బూనవలయును. ఇంటింటికి వెళ్లి పెద్దలను విషయముతో ప్రార్థించి వారి వారి బిడ్డలను బడికి బంపి విద్యాభివృద్ధి గలిగించుటకు మీరు తీవ్రమైన కృషి చేయవలసి యున్నది. సంసారబాధచేతను దరిద్రదశచేతను పాఠశాలకు పోవుటకు వీలులేని బాలబాలికలకు వయోజనులకును విద్యనేర్పుటకై రాత్రిపాఠశాలలను ఏర్పరచి నిరంతరోత్సాహముతో నిర్విఘ్నముగా సాగించుటవిషయము మీ రెన్నటికిని మరచిపోకూడదు.

### నేత పరిశ్రమ

మన వృత్తి, మన పరిశ్రమ సర్వజనులచే శ్లాఘింపబడినది. అందరికిని అత్యావశ్యకమైనది. అన్ని వృత్తులలో అగ్రగణ్యతను పొందినది. విదేశవస్త్రముల పోటీవల్లను, స్వదేశ ప్రజల నిరాదరము వల్లను మన వృత్తికి హీనస్థితి సంభవించినది. దీనిని తొలగించి నేతపరిశ్రమ నుద్ధరించుటకై దేశనాయకులును మన సంఘనాయకులును తోడిసోదరులును కొందరు దీక్షతో పనిచేయుచున్నారు. మీరందరు గూడ వారు చేయు ప్రయత్నములను బాగుగా తెలిసికొనుచు సర్వవిధముల సహాయపడుచు మన పరిశ్రమను ఉన్నతస్థితికి తేగలరని ఆశించుచున్నాను.

ఫ్లైషటిల్ మగ్గము 1901 వ సంవత్సరములో కనుగొనబడినది. మర రాటము, మర ఆసు, రాబి మున్నగునవన్నియును కనిపెట్టబడినవి.

మరమగ్గములు భారత చేనేతపరిశ్రమ నణగించి కాపాడినదని తెలుపుటలో అతిశయోక్తిలేదు. 100 సంవత్సరములకు పూర్వము మన దేశములో రాటమువీద తీసిన నూలుతో నేయుచుండువారు. రాటపు నూలేగాక తకిలీలమీద కూడా ఉత్తర హిందూస్థాన దేశమునందు ముఖ్యముగా బెంగాల్ రాజధానిలోని ఢక్కాయందు 1000 నెంబరు వరకు నూలు తీయుచుండిరి. ఆరణీ గ్రామములో మూటూరి కుటుంబీకులు మూడు నాలుగువందల నెంబర్ల నూలుతో తలపాగాలు నేయించి జమీందారులకు విక్రయించువారు.

### తుదివిన్నపము

ప్రతి విద్యాధికుడు విద్యావిహీనులకు తమ కులజులకు నిరంతరము విద్యాప్రబోధము గావించి వారి నుద్ధరించుట ప్రధాన కర్తవ్యముగా భావింపవలెను. స్వసంఘాభ్యుదయమునకై ప్రచురింపబడు శ్రీదేవాంగప్రభవ పత్రికలకు సహాయపడి శాశ్వతముగా సాగించుట సాంఘికుల విధియని జ్ఞాపకముంచుకొనవలెను.

### మదరాసు దేవాంగసంఘం

మదరాసులో మూడేండ్లనుండి ఏర్పడి యున్న చాకలిపేట దేవాంగసంఘం 3 వ వార్షిక సమావేశము 6 వ తేదీన భట్టికుమారస్వామిగారి(పెనగ)అధ్యక్షతన జరిగెను.